# తాతల నాటి కథలను తవ్వి పోసిన దిగవల్లి

ఎక్కడి కాకినాడ! ఎక్కడి భోపాల్! ఇక్కడ పుట్టారా? అక్కడ పరమపదించారా? కాకినాడలో పుట్టారు శివరావుగారు. కాలికట్టులో చదివారు. బహు నిక్కచ్చి వ్యక్తిత్వం. పెద్ద కుటుంబంలో పుట్టినా చిన్నప్పుడు అసౌకర్యాలెన్నో అనుభవించారు. కొవ్వూరులో అడవి బాపిరాజు చిన్న క్లాసులలో తన సహాధ్యాయి అని చెప్పారొకసారి. అక్కా, బావా వాళ్ల దగ్గరుండి కాలికట్టులో చదవాల్సి వచ్చింది కుటుంబ పరిస్థితులు అనుకూలించక. తండ్రిగారు 10 సం.ల వయస్సుననే చనిపోయారు. తండ్రిగారు వెంకటరత్నంగారు. తల్లిగారు సూర్యమాణిక్యాంబగారు. అధిక మాసాలతో కూడా లెక్కేసుకుంటే తొంభై ఆరు సంవత్సరాలు జీవించినట్లు దిగవల్లి వేంకట శివరావుగారు. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొర 1798లో పుడితే శివరావు మహాశయులు 1898లో పుట్టారు. బ్రౌన్ విదేశీయుడైనా తెలుగు సాహిత్యానికెంత సేవ చేశాడో మన శివరావుగారు తెలుగు వారి చరిత్రకంత సేవ చేశారు. ఆయన మేధ నిశితం. మాట ఖండితం. మనసు నిర్మలం. న్యాయవాదిగా జీవిక సాగించారు కాబట్టి చరిత్ర సాక్ష్యాధారాలు కూడా జడ్జిమెంటు లాగా ఉండాలని వారి అభినివేశం. మంచివాళ్లకు కాస్త ప్రథమ కోపం ఉంటూనే ఉంటుంది.

శివరావుగారూ మీరు మీ కథ చెప్పకపోతే ఈ తరంవాళ్ళకు ఎట్లా తెలుస్తుంది అని శతపోరినా వారు విన్పించుకున్నారు కాదు. ఏదో కొంత రాసినా దాన్ని పూర్తి చేశారు కాదు. 'విన్నంత, కన్నంత, తెలిసినంత' అని స్వీయచరిత్రకు పేరు పెట్టి బాల్యదశవరకు రాశారు. ఉన్నత పాఠశాల చివరి తరగతులు వీరేశలింగం ఆస్తిక పాఠశాలలో రాజమండ్రిలో చదివారు. వీరేశలింగం పంతులుగారిని చూశారు. ఆయన మెప్పు కూడా సంపాదించారు. ఒకసారి స్కూలు ఉత్సవంలో వీరేశలింగం పంతులుగారి హిందూ మత మహాసభ ప్రహసనం ప్రదర్శించారు స్కూలు విద్యార్థులు. పంతులుగారూ వచ్చారా ప్రహ[illegible]సనం తిలకించడానికి. శివరావుగా[illegible] పంతులుగారు ఈయన అభినయాన్ని చూసి కడుపు చెక్కలయ్యేట్లు పకపక నవ్వారు. పాఠశాలలో క్లాసు మొదలుకావడానికి ముందు రోజూ ప్రార్థన చేయాల్సింది శివరావే. కంఠం కమ్మగా ఉండేది. భావ ఔదాత్యంతో పద్యం చక్కగా చదివేవారు. పద్దాది సుబ్బారాయుడుగారంటే ఎంతో ఇష్టం.

ఆయన 'భక్త చింతామణి' అంతా ఈయనకు కంఠస్థం. అప్పట్లో గజవల్లి రామచంద్రుడుగారని థీయిస్టిక్ హైస్కూలు హెడ్మాస్టరుగారు సర్వాత్మనా జాతీయవాది. పై క్లాసుల వాళ్లకు చరిత్ర బోధించేవారు. బ్రిటిషువారి సత్యాలన్నీ క్లాసులో ఖండించి చెప్పేవారు. అప్పట్లో 'సిటిజన్ ఆఫ్ ఇండియా' అని ఒక పాఠ్య పుస్తకం ఉండేది. అది నిర్బంధంగా చదవాల్సిందే. అందులో అన్నీ అబద్ధాలు. రామచంద్రుడుగారు అభినివేశంతో ఆ పుస్తకాన్ని ఈకకు ఈక లాగి పారేస్తుంటే మాకెంతో ఉత్తేజకరంగా ఉండేది అని చెప్పారు ఒకసారి. తిలక్ మహారాజ్ చిత్రపటం కనపడుతుందేమోనని రాజమండ్రిలో పోలీసు వారు దురాగతంగా సోదా చేశారట ఆ రోజుల్లో. ఈ విషయాలన్నీ శివరావుగారికి నిన్న మొన్న జరిగినంత స్పష్టంగా జ్ఞాపకం. ఆయన గొప్ప జాతీయవాది.

వావిలాల గోపాలకృష్ణయ్యగారి వంటివారు శివరావుగారి పుస్తకాలు చదివి ప్రభావితులయ్యారు. కృష్ణా జిల్లా కాంగ్రెసు ఉద్యమ ప్రచార కార్యదర్శిగా ఉండేవారు శివరావుగారు. మద్రాసులో 'లా' చదివారు. 1922 కల్లా ఆయన బి.ఎల్. పూర్తి చేశారు. ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుకుంటున్న రోజుల్లోనే 'పోతన - వేమనల యుగం'పైన పోటీకి వ్యాసం వ్రాసి బహుమతి పొందారు శివరావుగారు. వావిలికొలను సుబ్బారావుగారు మాకు తెలుగు చెప్పేవారని ఎంతో ఆనందంతో ప్రస్తావించేవారు. 1947లో శివరావుగారు విజయవాడలో బార్ ఎసోసియేషన్ ప్రెసిడెంట్ అయ్యారు. సుప్రీమ్‌కోర్టు ఛీఫ్ జస్టిస్ పదవినందుకున్న కోకా సుబ్బారావు శివరావుగారికి లా కాలేజీలో సహాధ్యాయి. ఆయన ఒకసారి విజయవాడ వచ్చినప్పుడు న్యాయవాదుల స్వాగత సమావేశంలో శివరావుగారిని ఎంతో ఆప్యాయంగా పలకరించారు. పాత జ్ఞాపకాలు కలబోసుకున్నారు. ఇంకా పరిశోధన తీవ్రంగా సాగుతున్నదా అని మేలమాడారు సుబ్బారావుగారు.

శ్రీ శివరావుగారి సముఖ గోష్ఠిలో వినేవారికి ఆసక్తి ఉండాలే కాని ఈస్టిండియా కంపెనీ చరిత్ర అంతా పునరావృతమవుతుంది. కథలూ, గాథలూ అన్నీ సినిమా చూస్తున్నంత సరదాగా మనముందుకు వస్తాయి. సుభాస్ చంద్రబోస్‌ను ఇంటర్న్ చేసి మద్రాసు పెనిటేషంరీలో ఉంచారుట. అబ్బాస్ అలీ అప్పుడు మద్రాసు చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్. బోసును చూడటానికి వచ్చి 'ఎలా ఉంది. ఏమీ ఇబ్బంది లేదు కదా. అంతా సౌకర్యంగా ఉందా?' అని పరామర్శించారట. ఆహా చాలా బావుంది. మనం ఇద్దరం మన ఉద్యోగాలు మార్చుకుందామా ఏమిటి? అని సుభాస్ చంద్రబోస్ ఛలోక్తి విసిరారుట.

శివరావుగారిని చూడబోతే ఆయన అంతఃకరణానికి చేరువైన వాళ్లకు ఇటువంటి వృత్తాంతాలు శతాధికంగా విన్పించేవారు. కాళేశ్వరరావు, ప్రకాశం, కొండ వెంకటప్పయ్య అంటే నాకు అభిమానం. నేను గౌరవించే వ్యక్తులు వాళ్ళు.

గాంధీ ఉద్యమాన్ని గూర్చి ఎన్నెన్ని సంగతులో ఆయన వేళ్ళ చివర ఉండేవి. "నేను పెద్ద కేసులు మాత్రమే తీసుకొనే వాణ్ణి. చిన్నచిన్న కేసుల జోలికిపోయే వాణ్ణికాను. చాలా మందికి తెలియదు. నా వృత్తి నాకు చాలా తృప్తినీ, డబ్బునూ చేకూర్చాయని" అనేవారు శివరావు గారు. కడమకాలమంతా దొంతరలు దొంతరలు మద్రాసు కన్నెమరా లైబ్రరీ నుంచి నాకు పుస్తకాలు వచ్చేవి. అప్పుడా సౌకర్యం ఉండేది. కావల్సిన పుస్తకాలు లైబ్రరీ అధికారులు పంపించేవారు. వాటిని చదివి నోట్సు రాసుకుని మళ్ళీ పంపించేవాణ్ణి అనే చెప్పేవారు శివరావుగారు. 1938 లోనే కాంగ్రెసులో అవినీతి అధికార వ్యామోహం ప్రారంభమయ్యాయని, నొసలు చిట్లించుకునేవారు శివరావుగారు. గాడిచర్ల హరి సర్వోత్తమరావు సెడిషన్ కేసు రికార్డ్సు అన్నీ మద్రాస్ ఆర్కైవ్స్‌లో ఉన్నాయి. చూడరాదు - అని ఆయన హెచ్చరిక చేసేవారు. ఆ తరం పెద్దలను గూర్చి ఆయన జ్ఞాపకాలు అమోఘం. మోచర్ల రామచంద్రరావు, ఆంధ్రరత్న ముట్నూరు, బిపిన్ చంద్రపాల్, ఇలా ఎన్నో ఉదంతాలు చెప్పే వారు శివరావుగారు. ముట్నూరి కృష్ణారావు ఒక రెండు మహానదుల సంగమం అని చెప్పే వారాయన.

దిగవల్లి వేంకట శివరావుగారే తెలుగు వారికి ఏనుగుల వీరాస్వామయ్యను పరిచయం చేశారు. దానికి అత్యద్భుతమైన వివరణలు, తబ్సీళ్ళు, ఆనాటి సాంఘిక పరిస్థితులు తెలివిడులు కూర్చారు. 18, 19 శతాబ్దాల తెలుగువారి చరిత్రకు కాణాచి శివరావుగారు. బహుశా ఈస్టిండియా కంపెనీవారి కలివెలు, కడపాలు, సన్నదులు, ఆజ్ఞాపనలు గురించి శివరావుగారి దగ్గర ఉన్న మౌలిక సామగ్రి, సాక్ష్యాధారాలు మరే చారిత్రకవేత్త దగ్గర ఉండకపోగా, ప్రభుత్వ పురావస్తు, పురాచారిత్రక సామగ్రి పరిరక్షక సంస్థలలో కూడా ఉండవేమో! వారి బ్రిటిష ఇండియా చరిత్ర ఒక 'మేగ్నంజపస్'. దక్షిణాఫ్రికా చరిత్ర ఒక గొప్ప గ్రంథం. అధినివేశ స్వరాజ్యం అత్యద్భుతమైన గ్రంథం.

కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, నేలటూరి వెంకటరమణయ్య, భావరాజు వెంకట కృష్ణారావుల పేర్లతో కలిపి చెప్పుకోవల్సిన విశిష్ట చారిత్రక వేత్తృత్వ వ్యక్తిత్వం శివరావుగారిది. వారి కంటే కూడా ఈయన ఆధునిక భారతదేశ చరిత్ర, అందునా తెలుగు వారి చరిత్రను గూర్చి అత్యంతాభినివేశశీలి. పరమ ప్రామాణికుడు. విశ్వనాథ సత్యనారాయణ గారు శివరావుగారి చారిత్రక సత్యనిరతికి, జాతీయాభిమాన అచ్చ స్వచ్ఛ హృదయానికి మెచ్చి 'ప్రళయనాయుడు' అనే తథ్యచారిత్రక వీర పురుషేతి వృత్తరూపకాన్ని శివరావుగారికి అంకితం ఇచ్చారు.

-అక్కిరాజు రమాపతిరావు